**శ్రీవేదాన్త పఞ్చదశి శ్లోకము 1-50** (ఆత్మాశ్రయాది దోష వర్ణనము)

శంక:–***సవికల్పస్య లక్ష్యత్వే లక్ష్యస్య స్యాదవస్తుతా ।***

***నిర్వికల్పస్య లక్ష్యత్వం న దృష్టం న చ సంభవి ॥*** *(వే.పం.1-49)*

తత్త్వమస్యాది మహావాక్యములకు లక్ష్యమగు అఖండసచ్చిదానంద పరబ్రహ్మము సవికల్పకమా? లేదా నిర్వికల్పకమా?

వికల్పముతోకూడిన బ్రహ్మమే మహావాక్యమునకు లక్ష్యమన్నచో, నామజాత్యాదులతో కూడినద గుటవలన బ్రహ్మము అవస్తువగును (మిథ్యాయనదగును). కల్పితనామము,రూపము,గుణము,క్రియ, జాతి,సంబంధాదులు వికల్పములగును. కల్పితనామరూపాదులు బ్రహ్మమునకు నిత్యములేయగునేని నామరూపాదులవలె బ్రహ్మము మిథ్యయేయగును.

నిర్వికల్ప(నామరూపాదిశూన్య) బ్రహ్మమునకు లక్ష్యత్వము చెప్పినచో [1]వ్యాఘాతమగును. నిర్విక ల్పవస్తువు లక్ష్యమగుట లోకములో యెక్కడ కానరాదు(దృష్టాంతము దొరకదు). అట్లూహించుటకును వీలులేదు.

పై శంకకు జాత్యుత్తరము(అసదుత్తరము) చెప్పబడుచున్నది – అనగా యథార్థనిర్ణయమునందు చేయబడు అసత్ ప్రశ్న(కుతర్కమున)కు సమాధానము చెప్పకుండా, ప్రతివాది చేసిన ప్రశ్నను వికల్పించి, 'ఉష్ట్రలకుటికాన్యాయము'చే ఆ ప్రశ్నపైననే మళ్ళీ ప్రశ్న చేయబడుచున్నది.

***శ్లో ॥వికల్పో నిర్వికల్పస్య సవికల్పస్య వా భవేత్ ।***

***ఆద్యే వ్యాహతిరన్యత్రానవస్థాత్మాశ్రయాదయః ॥****(వే.పం.1-50)*

---

1 ఇచ్చట వ్యాఘాతమునకిది యర్థమగును. శబ్దముయొక్క లక్షణావృత్తిచేత తెలియబడు అర్థము(వస్తువు) లక్ష్యార్థము (లక్షణాకు విషయము=లక్ష్యము) అగును. ఆ లక్ష్యమునందు, ఎట్లు అనేక గోవులలో గోత్వజాతిరూప ధర్మమువలె, అనేక ఘటములలో ఘటత్వజాతిరూప ధర్మమువలె, అనేక మనుష్యులలో మనుష్యత్వజాతిరూప ధర్మమువలె లక్ష్యత్వరూప ధర్మ ముండును. లక్ష్యతా(జాతి)రూప ధర్మము వికల్పముగాన లక్ష్యము సవికల్పమగును. అలాంటప్పుడు దానిని నిర్వికల్పమను ట వ్యాఘాతరూప దోషమగును.

***శ్లో ॥మమ ముఖే జిహ్వా నాస్తి మాతా మే వంధ్యా ఆసీత్ । పితా మే బాల బ్రహ్మచారీ అపుత్రశ్చ పితామహః ॥***

మహావాక్యమునకు లక్ష్యమగు బ్రహ్మము సవికల్పకమా? లేక నిర్వికల్పకమా?–అను వికల్పము, నిర్వికల్ప బ్రహ్మమునకుండునా? లేక సవికల్పబ్రహ్మమునకుండునా? మొదటిపక్షమున వ్యాఘాతము= పూర్వోత్తర విరోధము=చెప్పినమాటకే భంగము వాటిల్లును. మరియు ఎచ్చటను దృష్టమును లేదు, సంభవముగూడ లేదను పూర్వము పూర్వపక్షి చెప్పిన దోషము ప్రసక్తమగును. రెండవపక్షమును స్వీకరించినచో, అనవస్థా=ముగింపు లేకుండుట, ఆత్మాశ్రయము=తన్ను తానే ఆశ్రయించుట, అన్యోన్యాశ్రయము మరియు చక్రకమను నాలుగు దోషములు ప్రాప్తించును.(శ్లోకార్థము)

***ఆత్మాశ్రయ దోషము:***–"సవికల్ప బ్రహ్మమునకు వికల్పమున్నది" – అను వాక్యమున సవికల్పశబ్దమునకర్థమిదియగును. శ్రద్ధగా వినండి. "వికల్పేన సహ వర్తత ఇతి సవికల్పః" వికల్పసహితమైయుండునది సవికల్పబ్రహ్మరూప ధర్మి. ధర్మియనగా ఆశ్రయము=అధికరణము=అనుయోగి. ఆ సవికల్ప బ్రహ్మముయే వికల్పముతో కూడినదైయున్నదో, ఆ వికల్పము ఈ ప్రసంగమునందు తృతీయాంత (తృతీయా విభక్తి) పదముచే చెప్పబడును. మరియు పూర్వపక్షి సవికల్పబ్రహ్మమునందు యే వికల్పము చేసియుండెనో, ఆ వికల్పము ప్రథమాంతవికల్పముగా ( ప్రథమా విభక్తి పదముచే ) చెప్పబడును. ఇప్పుడు పూర్వపక్షిని ఇట్లడుగవలెను.

ఓయీ ప్రతివాదీ! ప్రథమాంతవికల్పపదముచే మరియు తృతీయాంతవికల్పపదముచే రెండునూ ఒకే వికల్పమందువా? లేక భిన్నములందువా?ఒకవేళ ఒకే వికల్పము ప్రథమాంతరూపమునూ మరియు తృతీయాంతరూపమునూ ఉన్నదంటివేని, అప్పుడు తాను ఒకే వికల్పము, వికల్పమునకాశ్రయమగు సవికల్పబ్రహ్మమునకు విశేషణమగుటవలన, బ్రహ్మముతోకూడిన (తృతీయాంతవికల్పమగు) తనయందు (నీ ప్రథమాంత వికల్పరూపముచే) తనకు తానే ఆశ్రయమగును. ఎందుకనగా! విశిష్టమునందుండు ధర్మము విశేషణమునందుండునను నియమముచే.

ఇచ్చట ఈ విచారము గలదు. ఒకే వికల్పము తృతీయాంతరూపముచే ప్రథమాంతరూపమగు తనకు ఆశ్రయమెట్లగును? వినుము. విశిష్టమునందుండు ధర్మము విశేషణమునందుండునను నియమముచే. దీనియర్థమిదియగును–విశేషణసహిత (విశిష్ట) వస్తువునందు యే ధర్మముండునో, ఆ ధర్మము నియమముచే విశేషణమునందుగూడ ఉంటుంది. ఉదా:–"దండీ ఆగతః=దండీ వచ్చాడు" అనగా దండము=పొడుగాటి కర్రను చేతిలో ధరించిన పురుషుడు వచ్చాడు. ఈ వాక్యములో దండము విశేషణము (ఆధేయము), పురుషుడు విశేష్యము (ఆధారము)న్నది. దండరూప విశేషణముతో కూడిన విశిష్టుడగు దండీపురుషునియందు ఆగమనక్రియారూప యే ధర్మము గలదో, ఆ ధర్మము దండరూప విశేషణమునందుగూడ ఉంటున్నది. ఎట్లు దండీపురుషుడు వచ్చాడో, అట్లే దండముగూడ వచ్చినది.

సిద్ధాంతము:–ఇచ్చట దండీపురుషునివలె సవికల్పబ్రహ్మాత్మ విశేష్యమగును, దండమువలె తృతీయాంత వికల్పము విశేషణమగును. మరియు దండవిశిష్టదండీవలె తృతీయాంతవికల్పవిశిష్ట సవికల్పబ్ర-

హ్మాత్మయగును. విశేషణసహిత (విశిష్ట) పురుషునియందలి గమనక్రియారూప ధర్మమువలె (ప్రతివాది యగు నీ) ప్రథమాంత వికల్పమున్నది. ఎట్లు దండీపురుషుడు గమనక్రియకు ఆశ్రయమో, అట్లే దండము గూడ గమనక్రియకు ఆశ్రయమున్నది. అదేప్రకారముగా ఎట్లు నీయొక్క ప్రథమాంతవికల్పమునకు సవిక ల్పబ్రహ్మము ఆశ్రయమున్నదో, అట్లే సవికల్పబ్రహ్మమునకు విశేషణరూప తృతీయాంతవికల్పముగూడ నీయొక్క ప్రథమాంతవికల్పమునకు ఆశ్రయమున్నది. నిష్కర్షయేమనగా, ఒకే వికల్పము–వికల్పమునకా శ్రయమగు బ్రహ్మమునకు విశేషణమున్నందున ప్రథమాంతరూప తనకు ఆశ్రయమగుచున్నది. ఇట్లు ఒకే వికల్పము తృతీయాంతరూపముచే ఆశ్రయము మరియు ప్రథమాంతరూపముచే ఆశ్రితమగుటవలన, తనయొక్క స్థితికి తనయొక్క అపేక్షారూప ఆత్మాశ్రయ దోషము ప్రాప్తించును.

***అన్యోన్యాశ్రయ దోషము:***–ఆత్మాశ్రయదోషమునుండి ముక్తినొందుటకై,ప్రథమాంతవికల్పము మరి యు తృతీయాంతవికల్పము పరస్పరము భిన్నములని యంగీకరించినచో, తృతీయాంతవికల్పముగూడ ఒక వికల్పమేగాన, దానికి ఆశ్రయమగు బ్రహ్మము సవికల్పమున్నందున, ఆ తృతీయాంతవికల్పమునకు ఆశ్రయమగు బ్రహ్మమునందు ఏదో ఒక విశేషణరూప వికల్పమును స్వీకరించవలయును. ఈ వాక్యము చే ఇట్లు సూచించడమైనది–ఏయే వికల్పముండునో,ఆయా వికల్పము సవికల్పము అనగా, వికల్పసహిత ఆశ్రయమునందే ఉండును, నిర్వికల్పమునందు ఉండదు. వికల్పశూన్యమునందు (నిర్వికల్పమునందు) వికల్పము సంభవించదు.పూర్వోక్త వ్యాఘాత దోషము ప్రసక్తమగును. ఎట్లు ప్రతివాది చేసిన ప్రథమాంత వికల్పము సవికల్పాశ్రయమందుండునో, అట్లే సకల వికల్పములు సవికల్పాశ్రయమందే ఉండగలవు. అందువల్ల, యేవిధముగా నీయొక్క ప్రథమాంత వికల్ప స్థితికొఱకై తృతీయాంతవికల్పసహిత ఆశ్రయమగు ధర్మిరూప బ్రహ్మమును సవికల్పముగా స్వీకరించనైనదో, అట్లే తృతీయాంతవికల్ప స్థిత్యర్థము, ఏదో ఒక విశేషణరూప వికల్పమునకు ఆశ్రయమును సవికల్పమనుట ఉచితమేయగును. తృతీయాంతవికల్పము నకు ఆశ్రయమగు ధర్మిరూప బ్రహ్మమునకు, నిర్వికల్ప బ్రహ్మమునుండి వ్యావృత్తిజేసి (వేరుజేసి) తెలుపు నదగు యే విశేషణరూప వికల్పము స్వీకరించబడినదో, ఆ వికల్పము విశేషణీభూత వికల్పమనబడును.

ఆ విశేషణీభూత వికల్పము యేమి ప్రథమాంతరూపమందువా? లేక ప్రథమాంతవికల్పముకంటె మరియు తృతీయాంతవికల్పముకంటె భిన్నమగు మూడవదియా? ప్రథమపక్షమునంగీకరించినచో, అనగా–తృతీయాంతవికల్పమునకు ఆశ్రయమగు విశేషణీభూత వికల్పము ప్రథమాంతరూపమేయగున న్నచో – అన్యోన్యాశ్రయ దోషమగును. ఎట్లనిన, వినుము. "పరస్పర సిద్ధికొఱకు పరస్పరముయొక్క అపే క్షను అన్యోన్యాశ్రయమందురు" ఈ లక్షణము ప్రథమపక్షమునందు ఘటిల్లుచున్నది. ఏలయన, ఇచ్చట ప్రథమాంతవికల్ప స్థితికొఱకు తృతీయాంతముయొక్క అపేక్ష గలదు. మరియు తృతీయాంతవికల్ప స్థిత్య ర్థము విశేషణీభూతవికల్పముయొక్క అపేక్ష ఉన్నది. ఆ విశేషణీభూతవికల్పము ప్రథమాంతరూపమున్న దని ప్రతివాదియే అంగీకరించెను. కావున, తృతీయాంతమునకు ప్రథమాంతముయొక్క అపేక్ష వచ్చినది.

ఈరీతిగా ప్రథమాంతవికల్పమునకు తృతీయాంతవికల్పముయొక్క మరియు తృతీయాంతవికల్పమునకు ప్రథమాంతవికల్పముయొక్క అపేక్ష కలిగినందున అన్యోన్యాశ్రయ దోషము ఘటిల్లును (ప్రాప్తించును).

***చక్రికా దోషము:–*** ఒకవేళ విశేషణీభూతవికల్పము ప్రథమాంత తృతీయాంతవికల్పములకంటె భిన్నము మూడవదిగా అంగీకరించినయెడల, ఈ విశేషణీభూత మూడవ వికల్పముగూడ పూర్వమువలె వికల్పమే గనుక, ఈ విశేషణీభూత వికల్పమునకు ఆశ్రయమగు బ్రహ్మము సవికల్పమగుటవలన, ఆశ్ర యమగు బ్రహ్మమును వికల్పసహితము చేయుటకు అన్యవిశేషణరూప 'ధర్మివిశేషణీభూత' వికల్పము ను అంగీకరించవలయును.

ప్రథమాంతవికల్పము, తృతీయాంతవికల్పము మరియు విశేషణీభూత వికల్పము – అని యెట్లు మూడు వికల్పములకు సంకేతముగా పేర్లు ఇవ్వబడెనో, అట్లే విశేషణీభూత వికల్పమునకు ఆశ్రయరూప నాల్గవ వికల్పమునకు సంకేతముగా శ్రీరామకృష్ణులవారు(టీకాకారులు) ధర్మివిశేషణీభూత వికల్పమని పేరిడెను. దానికే అన్యవిశేషణమని చెప్పబడినది.

ఆ అన్యవిశేషణరూప వికల్పము యేమి ప్రథమాంతవికల్పరూపమున్నదా? అథవా ప్రథమాంత, తృతీయాంత మరియు విశేషణీభూత మూడవ వికల్పముకంటె భిన్నము నాల్గవదియా? ప్రథమపక్షమున చక్రికా దోషము ప్రాప్తించును. ఎట్లనగా, వినుము. 'చక్రమువలె భ్రమణమునకు చక్రకము లేదా చక్రికా' అని యందురు. ఇచ్చట, ప్రథమాంతవికల్ప స్థితికొఱకు తృతీయాంతవికల్పముయొక్క అపేక్ష గలదు. తృతీయాంతవికల్ప స్థిత్యర్థము విశేషణీభూత మూడవ వికల్పముయొక్క అపేక్ష గలదు. ఆ విశేషణీభూత వికల్ప స్థితికోసము అన్యవిశేషణరూప ధర్మివిశేషణీభూత నాల్గవ వికల్పముయొక్క అపేక్ష ఏర్పడినది. ఆ అన్యవిశేషణరూప ధర్మివిశేషణీభూత నాల్గవ వికల్పము ప్రథమాంతరూపమున్నదని పూర్వపక్షి ఒప్పుకు న్నందున, తిరిగి ప్రథమాంతవికల్ప స్థితికొఱకు తృతీయాంతవికల్పముయొక్క అపేక్ష, తృతీయాంతవికల్ప స్థిత్యర్థము విశేషణీభూత మూడవ వికల్పముయొక్క అపేక్ష, దాని స్థితికొఱకు మళ్ళీ ప్రథమాంతవికల్పము యొక్క అపేక్ష కలుగుచున్నందున చక్రభ్రమణమువలె చక్రికా దోషము ప్రాప్తించినది.

***అనవస్థా దోషము:–*** ఒకవేళ, ధర్మివిశేషణీభూత వికల్పము ప్రథమాంత, తృతీయాంత మరియు విశేషణీభూత మూడవ వికల్పముకంటె భిన్నము నాల్గవదిగా స్వీకరించినయెడల, ఆ అన్యవిశేషణరూప చతుర్థవికల్పముగూడ పూర్వమువలె వికల్పమే గనుక,దానికి ఆశ్రయమగు బ్రహ్మమును వికల్పసహితము చేయుటకై యేదో ఒక అన్యవిశేషణరూప ఐదవ వికల్పమును అంగీకరించవలయును. ఆ ఐదవ వికల్ప ముగూడ వికల్పమే గావున, దానికి ఆశ్రయమగు బ్రహ్మమును వికల్పసహితము చేయుటకు యేదో ఒక విశేషణరూప ఆరవ వికల్పమును స్వీకరించవలెను. అట్లే ముందుగూడ దాని స్థితికొఱకు ఏడవది, దాని స్థితికోసము ఎనిమిదవది అంగీకరించవలెను. ఈరీతిగా ప్రమాణశూన్య అనంత కల్పనరూప ధారా (ప్రవాహము) అనబడు అనవస్థా దోషము ప్రాప్తించును.

***శ్లో ।।ఇదం గుణ క్రియా జాతి ద్రవ్య సంబంధవస్తుషు ।***

***సమం తేన స్వరూపస్య సర్వమేతదితీష్యతామ్ ।।*** *(వే. పం. 1-51)*

ఈ న్యాయము–శబ్దస్పర్శాది గుణములు, క్రియా=వ్యాపారము, జాతి, పృథివ్యాది ద్రవ్యములు, సంయోగాది సంబంధ పదార్థములయందు సమానమే.(వ్యాఘాతము మొదలుకొని అనవస్థా దోషపర్యంతముగల దోషములన్నియు కేవలము ఈ వికల్ప పక్షమునందేగాక అన్యత్ర – ద్రవ్యము, గుణము, జాతి, క్రియ, సంబంధరూప వస్తువులయందు గూడ ప్రసరించునని బుద్ధిమంతులు తెలియగలరు).

ద్రవ్యత్వము తద్రహితునికి గలదా? తత్సహితునికి గలదా? గుణత్వము తద్రహితునికి గలదా? తత్సహితునికి గలదా? క్రియ తద్రహితునికి గలదా? తత్సహితునికి గలదా? జాతి తద్రహితునికి గలదా? తత్సహితునికి గలదా? సంబంధము తద్రహితునికి గలదా? తత్సహితునికి గలదా? ఆద్యపక్షమునందు వ్యాఘాతము, ద్వితీయపక్షమునందు ఆత్మాశ్రయాది చతుర్విధ దోషములు సంక్రమించును.

ఈ కారణమువల్ల–ఈ గుణాదులన్నియు బ్రహ్మస్వరూపమునందే కల్పితములై యున్నవని అంగీకరింపబడు గాక!

హరిః ॐ తత్సత్

